





ఓమ్.

# ధ్యానామృతము.

శ్రీ మళయాళస్వాములవారిచే రచియింపబడిన

ఇది

తిరుమలలోనుండు

బుధజనవిధేయుండగు శ్రీ దూపం రామరెడ్డివారి

ద్రవ్యసహాయముచే


తిరుపతి పుండరీకనిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపబడియె.

1930.

[వెల. 0-2-0]  [మొదటికూర్పు ప్రతులు 1000.




# పీఠిక.

ఓ ప్రియసోదరులారా జ్ఞానేనహీనః పశుభిస్సమానః అనగా జ్ఞానహీనులైనవారు పశువులతో సమానులని శ్రుతులు మొరలిడుచున్నదిగదా. యీజ్ఞానమే సర్వానర్థ నివృత్తికరమైన శాశ్వతానంద మోక్షమని వేదసమ్మతము. దీనికి భక్తియేముఖ్యసాధనమని శ్రీవశిష్ట వేదవ్యాసనారదాది మహాఋషులయొక్క ముఖ్యాభిప్రాయమై వున్నది. దీపమునకు తైలమున్ను యవాదిఓషధులకు జలమున్నూ యేలాగున ముఖ్యసాధనమయి వున్నదో ఆలాగుననే ఆత్మజ్ఞానమైన దీపమునకు భక్తి తైలమువంటిది. జ్ఞానానందమైన మందారవృక్షమునకు భక్తిజలము వంటిది యీకారణముచే కరుణానిధియైన శ్రీకృష్ణభగవంతులు భగవద్గీతయందు భక్త్యామామభిజానాతి అని శెలవు యిచ్చియున్నారు. దీనికి కారణమేమనగా భక్తిమార్గమందు యేలాగైన ఒక్క అపాయములేదు. యిది యునుంగాక ఆబాలాదివృద్ధ ఆచండాలాది పర్యంతము గల స్త్రీ పురుషులున్నూ దీనికిపాత్రులే యెవరికి జ్ఞానము అధికముగావున్నదో వారుగదా జ్ఞానమునకు ము

ఖ్యాధికారులు వాత పిత్తశ్లేష్మ దోషములచే శరీరమున
కు గలిగెడురోగనివారణార్థమై ఆయుర్వేదము యేర్పడి
నది. అలాగునకే ఆత్మనుబాధించిన మల అజ్ఞానవిక్షే
పములు లేక సత్వరజస్తమోగుణములయిన అజ్ఞాన మహా
రోగనివారణకొరకు కర్మోపాసన జ్ఞానములనెడు మూ
డుమార్గములు వేదమందు ప్రసిద్ధమయివున్నది. ఆక
లిలేనివారికి అన్నమెందుకు రోగములేనివారికి ఔషధ
మేల దీనిరహస్యమేమనగా స్త్రీ శూద్రులు మొదలయి
నవారు బ్రహ్మవిచారమునకు అర్హులు కాదనియును
భగవద్గీత మొదలయిన దివ్యగ్రంథములు పారాయణము
చెయరాదనియును కొందరు చెప్పి భయపెట్టుచు
న్నారు. యిదియెంత అసంబంధము స్త్రీ శూద్రులు
అజ్ఞానులయినయెడల వారికే జ్ఞానశాస్త్రము యేర్పడివు
న్నది. జ్ఞానులయినయెడల దీనికై చెప్పనక్కరలేదు సమ
స్తవేదవేదాంత రహస్యములు శ్రీ పరమేశ్వరుడు శ్రీ
పార్వతీదేవి కుపదేశించినట్లున్ను అలాగుననే పరమా
త్మయైన శ్రీమన్నారాయణుడు భూదేవికి బోధించినట్లు
శాస్త్రములలో కనబడుచున్నయది యిదియునుంగాక మ
హాయోగీశ్వరులైన కపిలాచార్యులకు తనతల్లియైన దేవ
హూతికి సాంఖ్యతత్వోపదేశమున్ను ఋషిశ్రేష్ఠులైన

యాజ్ఞవల్క్య మహాఋషి తనభార్యయైన మైత్రేయికివే
దాంతి జ్ఞానోపదేశము బోధించినట్లు భాగవతబృహదా
రణ్యకోపనిషత్తులలో ప్రసిద్ధముయున్నది. ఋషిపుం
గవుండైన మతంగ మహాఋషి అంత్యజాతి సంబోధ
మైన శబరికిన్ని సప్తఋషులు వాల్మీక మహాఋషికిన్ని
జాలంధ్రయోగీశ్వరుడు మయినావతికిన్ని జ్ఞానోపదేశము
చేసినట్లు శాస్త్రప్రసిద్ధముగదా శ్రీవాశిష్టమందు మహా
యోగిణులయిన చూడాలకర్కటి మొదలయినవారిచరి
త్రములు లోకవిఖ్యాతమైయున్నది. శ్రీ భక్తవిజయమందు
పరమభక్తులైన స్త్రీపురుష చండాలమ్లేచ్ఛజాతి మొదల
యినవారి పావనమయినపవిత్రచరిత్రము దిగంతవిశ్రాం
తమయివున్నది. అలాగుననే శివభక్తాగ్రగణ్యులయిన
శ్రీనంద కన్నప్పనాయన మొదలయినవారిభక్తి తేటమని
చెప్పవచ్చును. అలాగుననే శ్రీవైష్ణవ భక్తాగ్రేసరుల
యిన శ్రీ తిరుపాణిఆళ్వారు పంచమజాతియందున్నవారు.
ఆండాళ్ స్త్రీజన్మమునందుజన్మించినవారుగాయియున్నం
గాక శ్రీవెంకటేశపాదారవిందమందుమహాయోగినియైన
శ్రీతరిగొండవెంగమాంబా దివ్యచరిత్రములు యెంతదివ్య
ముగానుండినది యిదియునుంగాక వుపనిషత్తు యోగజ్ఞాన
శాస్త్రములలోనానా యోనియందు జన్మించినస్త్రీపురుషులు

లెక్క లేనివారు బ్రహ్మధ్యానముచే పరబ్రహ్మమును పొందిరి
నవారిలో గోచరార్థమై కొంతపుణ్యాత్ములుపేరుమాత్రం
యిచ్చట సూచనగా కన్పింపబడినది దానిలో శ్రీవశిష్ట
ఋషీంద్రుండు వేశ్యయందును శ్రీవేదనిధియైన వేదవ్యా
సమహామౌని బెస్త స్త్రీయందును త్రిలోకసంచారిఅయిన
శ్రీ నారదమహర్షి చాకలి కన్యయందును శ్రీ మతంగమ
హర్షిపుంగవుండు మాదిగ యువతియందును మాండవ్య
మునీశ్వరుండు కప్పయందును వాల్మీకితపోధనుండు కిరా
తకులమందును విశ్వామిత్రమునిశ్రేష్టుండు క్షత్రియకుల
మందును అవతరించినవారై పరమేశ్వర ధ్యానముచే
బ్రహ్మఋషిప్రముఖులైరిగదా ఆలాగుననే యిప్పుడున్నూ
గలదు శ్రీగురునవక్కున్నూ రెడ్డికులసంభూతుడైన దొడ్డ
వేమన యోగీశ్వరుండున్నూ కొంతకాలముక్రిందటనే
అంతర్ధానమయినవారే ఆలాగుననే స్త్రీలలోను మైత్రే
యి సులభా, గార్గి, శాండిల్యా, చూడాల, శబరి
మొదలైనలెక్కలేని మహాయోగినిలున్నూ కలరు వీరంద
రున్నూ తపోశక్తిచే పవిత్రస్వరూపులై పరబ్రహ్మస్వరూపు
లైరి. ఎట్లనగా స్పర్శవేదిచే ఇనుము బంగారు అయినట్లు
న్నూ రసాయనశాస్త్రజ్ఞులు లోకవస్తువును మరొకవ
స్తువుగా మార్చునట్లున్నూ వీరున్నూ ఆత్మజ్ఞానశక్తిచే మురికి

తననైన మాయను మటుమాయముచేసి నిత్యశుద్ధపరి పూర్ణ పరమాత్మస్వరూపులయిరి. ఇప్పుడున్ను వర్తక హిందూస్థానములో అనేకస్థలములయందు యోగినిలుబ్ర హ్మచారిణిలు మొదలయినవారి మఠములను నేనేదర్శించి నాను వీరందరున్ను అధ్యాత్మశాస్త్రములలో మహావి దుషులే అరోక్ష్యత్తములారా సమస్తజీవరాసులున్ను వాస్త వముగా పరమాత్మస్వరూపులే నామరూపములు వేరువే రుగానున్నప్పటికిన్ని వస్తువొక్కటియే. జగదీశ్వరుండు కరుణామూర్తిగదా. అప్పుడు తనఅంశభూతులయిన జీవ రాసులున్ను తనస్వరూపులే అగునుగదా చక్కెరచేచే యబడిన బొమ్మయొక్క ఆపాదమస్తకపర్యంతము అధిమ ధురముగానుండును అలాగుననే వేదపురుషముఖమునుం డి బ్రాహ్మణులున్ను బాహువునుండి క్షత్రియులున్ను వూరువునుండి వైశ్యులున్ను పాదమునుండి శూద్రులు న్ను జన్మించినట్లు కొన్నికొన్ని శ్రుతులు చెప్పుచున్నది. అట్లున్నప్పటికిన్ని వారందరు పరమాత్మస్వరూపులే లేక మేడివృక్షమునకున్ను పనసచెట్టునకున్ను ఆపాదచూడ పర్యంతము ఫలములుకలదు మేడిచెట్టునందుగల ఫలము లంతయు మేడిఫలములేగాని యింకొక్క ఫలములేదు. అలాగుననే పనసచెట్టునందుచుకూడ కలదు. రుచులకు

న్న మార్గాలు లేదు పిందె, కాయ, పండ్లు యీభేదము కలదు దీనికి గుణములని పేరు సత్వరజస్తమో గుణములన ననుసరించి జాతిభేదములుకలదుగాని యింకొక్క విధము కానేరదు కనక మొక్కటియైనను కటికాది కుండలములు అనేకములు మట్టి యొక్కటియైనను పాత్రములు బహువిధములు నూలు యేకమైనను వస్త్రములు నానా ప్రకారములు కొయ్య యొక్కటియైనను బొమ్మలు పలు తెరంగులు నామరూపములు వేరువేరుగా నుండినను యిది అంతయున్న సూక్ష్మదృష్టిచే చూచునప్పుడు ఏకమైన పరమాత్మయందుండి అనేకములై యీప్రపంచము పరిణమించినది యీకారణముచే అభేదదర్శనం జ్ఞానం, సంసారం భేదదర్శనమని శ్రుతులు చెప్పుచున్నయవి యీలాటి సంశయములు భక్తులైన అనేక స్త్రీ పురుషలవాతో అప్పుడప్పుడు యడుగ కారణముచే యీచిన్న పుస్తకము వ్రాయుటకు కారణమైనది. దీనియందువ్రాయబడిన ధ్యానాదిశ్లోకములు నేనుచిన్నకాలమందు ధ్యానించినవదే. అవియంతయు ఒక చిన్ననోటుపుస్తకమునందు వ్రాసిపెట్టియుండినవి. యిదియంతయును అనేక గ్రంథములలోనుండి సంగ్రహించినదిన్ని అనేకమహానీయులచే గ్రహించినదిగాయున్నది. దీనియందేవ నారద

గాన రామాయణముతోగూడ ధ్యానాదిమంత్రసహి
తము చేర్చుకారణము స్త్రీలకుగూడను *వృషలో
గార్థమై కృతార్థులుకావలయునని విచారముతో చెప్పి
నది యీపుస్తకము అతిథిసత్కారాభిలాష పరవశుడై
నవాడు క్షుత్పిపాసచే తపించువచ్చువారికి అన్నదాన
ముచేయ సాధ్యములేనియడల పానీయాది సత్కారము
చేసి విశ్రాంతిని చేయునట్లుగావున్నది. దీనియందుచె
ప్పిన విషయములు బహిరంతర శుద్ధిగల సర్వజనులును
అనుష్ఠించ వచ్చును బహిశ్శుద్ధి అంతప్రధానముకాదు
అంతఃశ్శుద్ధిమాత్రము తప్పకనుండవలయును బాహ్య
శౌచము బహుబాగుగాచేసినను అంతశ్శౌచములేనియె
డల వారుచేసిన జపధ్యాన వ్రతపూజలైన సర్వమున్ను
వ్యర్థమె పులుసుమొదలైన పదార్థము చేయు పాత్రము
యొక్క పైభాగమందు పొగచే నల్లగానుండినను ఆపదా
ర్థమునకు యేలాటి రుచిభేదమురాదు లోపలకళాయిచే
యక శుద్ధియున్నా లేనియడల ఆపాత్రయందు వొండిన
పులుసుపదార్థము యెట్లునిష్ప్రయోజనమగుచున్నదో
అలాగునే హృదయకమలమందు జీవకారుణ్య దైవభక్తి
సర్వభూత సమత్వభావము విషయవిరక్తి నిరాశ బ్రహ్మ
చర్యము మొదలయిన గుణములు యెవరికిలేదో వారికి

పరమదయానిధియైన భగవంతుండు తప్పక దర్శనమిచ్చి కృతార్థునిగా చేయును. యిది నిజము. ఆస్తికోత్తములారా కలియుగమందు మోక్షమునకు సులభముగా నుండును. దీనికి భక్తియే ముఖ్యసాధనము.

శ్లో॥ కృతేతపశ్చరేన్నైవ త్రేతాయాం యజ్ఞమేవచ
ద్వాపరే అర్చనంప్రోక్తం కలౌసంకీర్త్య కేశవం॥

2 సత్యాదిత్రయుగేభోద వైరాగ్యౌ ముక్తిసాధనౌ
కలౌతుకేవలాభక్తి బ్రహ్మసాయుజ్యకారిణీ॥

3 నాస్తినాస్తిమహాభాగ కలికాలసమంయుగం
స్మరణాత్కీర్తనాదేవ ప్రాప్నోతిపరమాంగతిం॥

4 ధ్యానాత్పాపానినశ్యంతి ధ్యానాన్మోక్షంచసిద్ధ్యతి
ధ్యానాత్ప్రసీదతిహరి ధ్యానంసర్వార్థసాధనం

5 నాస్తిధ్యానసమంతీర్థం నాస్తిధ్యానసమంతపః
నాస్తిధ్యానసమోయజ్ఞ తస్మాధ్యానంసమాచరేత్॥

6 కలౌభక్తిఃకలౌభక్తిః కృపాత్కృష్ణఃపురస్థితః॥

అని యీప్రకారము శ్రీభాగవతస్కంద యోగశాస్త్రోపనిషత్ మొదలయిన అనేకశ్రుతులు ఘోషించుచున్నది. తపోనిధియైన శ్రీవ్యాసులువారున్ను మోక్షసాధనసామగ్ర్యాం భక్తిరేవగరీయసీ అని తెలిపియున్నారు. భక్తిజ్ఞానములకు పేరుమాత్రము వేరుగాని పర

పక్వకాలమందు రెండున్ను ఒక్కటిఅవుచున్నది పుష్ప ముఃఫలమై మారునట్లున్ను చెరుకుపాలు కల్కండ అవున ట్లున్ను కీటకము భ్రమరమై పరిణమించునట్లున్ను నిర్మల మయిన భక్తిచే జీవస్వరూపము మారి శివస్వరూపము అవుచున్నది. ఓ ప్రియసోదరులారా సర్వజీవరాశియందు జ్ఞానదృష్టిచే లోకేశపరమాత్మని యెవరు దర్శించుదురో వారికిమాత్రమే శాశ్వతానంద పరమపదము దొరుకు నుగాని తదితరులు యోగముచేతగాని ధ్యానముచేత గాని తపముచేగాని కోటిజన్మములయందు కిరిప్రయ త్నముచేసినను దానినిపొంద నశక్యము దని కఠోపని షత్తు మొదలయినశ్రుతులు విపులముగా చెప్పుచున్నది. శ్రుతి ఏకోవశీ సర్వభూతాంతరాత్మ ఏకంరూపంబహుధా యఃకరోతి తమాత్మస్థం యేనుపశ్యంతిధీరా స్తేషాంసుఖం శాశ్వతంనేతరేషాం సర్వభూత సమాత్మానం సర్వభూ తానిచాత్మని సంపశ్య న్బ్రహ్మపరమం యాతినాన్య హేతునా॥

అని యీ కఠోపనిషత్తులు చెప్పుచున్నది. యీ లాగుననే శ్రీభగవద్గీతయందును శ్రీమత్ భాగవతమందును చెప్పబడుచున్నది. గీత. యోమాంపశ్యతిసర్వత్రసర్వం చమయిపశ్యతి తస్యాహంనప్రణశ్యామి సచమేనప్రణ

శ్లో॥ భాగవతము ఏకాదశస్కంధః సర్వభూతేషుయః
పశ్యే ద్భగవద్భావమాత్మనః భూతానిభగవత్యాత్మ న్యేష
భాగవతో త్తమః॥

సర్వభూతములలో భగవత్స్వరూపమున్నూ సర్వ
భూతములు భగవంతునియందును అలాగునే తనయందు
యెవరుదర్శించుచున్నారో వారే భాగవతోత్తములలో శ్రేష్ఠుం
డని భాగవతధర్మము చెప్పుచున్నది. యింతవరకున్నూ
చెప్పినసారమేమనగా తనవలెనే సమస్తమయిన సమస్త
జీవరాసులను ప్రేమతో జూడవలయును. లేనియెడల భగ
వత్కృప రానేరాదు భగవద్భక్తిచేయుటకున్నూ ఆత్మజ్ఞా
నవిచారమునకున్నూ శమదమాదిగుణములు వున్నయె
డల ఆచండాలపర్యంతముగల స్త్రీపురుషులున్నూ సంశ
యములేకయే అధికారులయివున్నది. నేత్రముగల సర్వ
జీవరాసులకున్నూ సూర్యుండు యెట్లు అగపడుచున్నదో
అలాగునను జ్ఞానదృష్టిగల అందరున్నూ పరమాత్మునిద
ర్శించుదురు జ్ఞానదృష్టి లేనివారు యెవరయినను అదిసా
ధ్యముకాదు యీభక్తిమార్గమందు తప్పొప్పులు శాస్త్రో
క్తవిధులు జూడవలెనిలేదు అనన్యమైనభక్తి వక్కటియే
చాలు పసిబిడ్డలు యేమితప్పుచేసినను తల్లి అదియంత
యును ప్రియముగానున్నది అలాగనే భక్తులయందు

యోఘిరప్యహం కరిగినప్పటికిన్నీ జగదీశ్వరుడు దానిని క్షమించును।

శ్లో॥ విధినావినినావాపి భక్త్యాయేమాముపాసతే
తేభ్యఃఫలంప్రయచ్ఛామి ప్రసన్నోహంనసంశయః॥

అని శ్రీ శివగీత చెప్పుచున్నది యీలాగననే శ్రీ భగవద్గీతయందును చెప్పబడుచున్నది.

శ్లో॥ ఏతుసర్వాణికర్మాణి మయిసన్న్యస్యమత్పరాః
అనన్యైనైవయోగేన మాంధ్యాయంతవుపాసతే।
తేషామహంసముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్
భవామినచిరాత్పార్థ మయ్యావేశితచేతసాం॥

ఓపార్థ యెవరుసర్వకర్మములు నాయందుసమర్పించి నేనేతల్లితండ్రి గురువను భావముతో ఏకాగ్రచిత్తులయి ధ్యానింతురో వారెవరయినను నేను వారిని జననమరణము యను సంసారసాగరమునుండి పుద్ధరించెదను.

శ్లో॥ తేషాంసతతయుక్తానాంభజతాంప్రీతిపూర్వకం
దదామిబుద్ధియోగంతం యేనమాముపయాంతితే॥
తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజంతమః
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేనభాస్వతా॥

ఓ అర్జునా యెవరు ప్రీతితోనన్నే భజింతురో వారికి నన్నుపొందవలసిన మార్గము తెలియలేనియెడల

జ్ఞానయోగము నేనే వారుప్రసాదించుచున్న అట్టియున్న భక్తులయొక్క హృదయ కమలమందు నేను ప్రవేశించి ప్రకాశమయిన జ్ఞానదీపమును నిలిపి అజ్ఞానాంధకారమును పోగొట్టి ప్రేమతో నేను వారిని కృతార్థులుగా చేయుదును.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥

యిది శ్రీభగవద్గీతయొక్క ప్రాణశ్లోకమై యున్నది. ఓయి అర్జునా నీవు ధర్మాధర్మములను గూడ పనిలేదు అజ్ఞానులమాటలను వినవలెను నీవు నన్నే శరణమని నమ్ముము సర్వపాపములనుండి నిన్ను నేనే రక్షించెదను శోకింపకుము సంశయమువదలుము నమ్మకముతో వర్తించుము యీలాగున అమృతసమానమయిన అనేకశ్లోకములు గీతయందుగలవు జనులారా యేజాతియందు పుట్టిన స్త్రీ పురుషులుగాని జీవకారుణ్యపరులై పరమాత్మయందు అనన్యభక్తిగలవారై నిర్మలమైన మనస్సుతో విషయ వైరాగ్యశీలురై పరోపకారముకొరకు తనశరీరమును బలియిచ్చువారై శాంతిగలవారైనను ప్రేమతో పరమాత్మను భజించినయెడల నిస్సంశయముగా వారు కృతార్థులగుదురు యిది సత్యము. అట్టియున్నవారు ధర్మార్థ కామమోక్షము లైన చతుర్విధ పురుషార్థములు పొందుదురు ఇదిమొద్ద

దుచరణారవిందముగా సత్యము సత్యము సత్యము.

పరమభక్తుడైన ఒక్క మహాత్మ యేకులమందు జన్మిం
చునో వారితల్లియున్నూ తల్లిగోత్రస్తులున్నూ తండ్రియు
న్నూ వారివంశస్తులున్నూ వీరిశిష్యసమూహమందరున్నూ
వీరునివసించిన గ్రామములో అందరున్నూ వీరి సహవా
సముజేసిన సర్వజనులున్నూ పరమపదమైన మోక్షము
నుపొందుదురు వీరుపడచిన భూమియున్నూ గూడా పవి
త్రమగును వీరియొక్క అరువతరగతులు మృతిపొందిన
పితరులున్నూ రాబోవు అరువతరగతి వరుసగా కుటుంబస్తు
లున్నూ మోక్షమునుపొందుదురు వీరికివున్న సుఖముయొ
క్క కోట్యంశములలో ఒక్కభాగముకూడా దేవేంద్రుడి
కిన్ని యేకచక్రవర్తికిన్ని లేనేలేదు. తదితరులకథ యేలచె
ప్పవలయును వీరిసుఖము చెప్పుటకై సహస్రఫణములు
గలఅనంతునకుగూడ అశక్యము॥

గురుగీత॥ శ్లో॥ ధన్యామాతా పితాధన్యో గోత్రంధన్యం
కులోద్భవః। ధన్యాచవసుధా దేవి యత్ర
స్యాద్గురుభక్తితా॥ సన్న్యాససముచ్చయం.

శ్లో॥ షష్టింకులాన్యతీతాని షష్టిమాగామితానిచ।
కులాన్యుద్ధరతే ప్రాజ్ఞః సన్న్యస్తమితియోవదేత్॥
నతత్సుఖం సురేంద్రస్య నసుఖంచక్రవర్తినాం।

యుత్సుఖం ప్రీతరాగస్య మునేగేకాంతశాలినః॥

దీనియర్థములు పైనజెప్పినవడే వీరిసంబాధులందరున్నా పరమపదము పొందుదురనిజెప్పిన దీనికి ఒక దృష్టాంత రము చెప్పెదను ఒక్క రయిలుబండి మంజర్ భారము తోకూడిన అనేకపెట్టెలను యెట్లులాగుకొని పోవుచున్న దో చుప్పయందు సారవేయతగిన అరటిపట్ట సుగంధపు ష్పముతో మాలకట్టనప్పుడు యేలాగున పరమేశ్వర శిరస్సువద్దను పొందుచున్నదో పైదకొరకు కిపిలతోలిన పిల్లముల్లో జిలువపక్కయందున్న తృణాదులు యెట్లుతృ ప్తిఅగుచున్నదో ఇల్లాగుననే వీరితపోశక్తిచే అన్యులుకూ డా కృతార్థులగుదురు. ఇట్లున్న మహాత్ముగాషునియొ క్క మహిమ మధాంధకారులు తెలియసాధ్యమా నేత్ర హీనులు ప్రకాశించిన సూర్యుని యెరుంగుదురా.

శ్లో॥ మంద భాగ్యాన జానంతి అంధాస్సూర్యమివోదితం॥

మర్మము మాఖ్యారవింఐవిని శృతిసుధామృతోపదేశ ములలో సారమైన రెండువుపదేశములు ప్రాశెవ యిది చిన్నపదమైనను అణుప్రమాణమైన వటవృక్షబీజమందుం డి మహత్తైనవృక్షము యెట్లుపరిణమించుచున్నదో అలా గునాగారుము దీనియొక్క అర్థగాంభీర్యము.

ఒకటిసర్వసమస్త ప్రాణులనున్నా సీతోపదేశము

గా అభేదమైచూచినయడల నిన్నుకరుణానిధియైన జగదీశ్వరుండు దయతో వారితో సమానముగా జూచును నీవు జీవరాసులను భేదముగా జూచినయడల నిన్ను సర్వేశ్వరుండు క్రూరదృష్టిచే భేదముగానేచూచును.

రెండవది నీ హృదయ నిష్కపట్య కవాటమును తెరచినయడల మోక్షద్వారపర్యంతముగల సమస్త ప్రతిబంధములున్ను సర్వదా నీకుగా తెరచివేశి గాచుకొనివుండును నీహృదయ కపటమైనకవాటమును మూశినయడల నీకు సర్వవిధములుగా మోక్షద్వార పర్యంతముగల కవాటములు దట్టముగావేశియుండును యిట్లు తమ శ్రీయసోత్తరుడు చరాచరసుఖాభిలాషి.

శ్రీ మలయాళస్వామి.



ఓమ్.

## శ్రీ రామతారక పరబ్రహ్మణే నమః

## శ్రీ నారద గాన రామాయణము

### బాలకాండః

శుద్ధబ్రహ్మపరాత్పర రామ
కాలాత్మకపరమేశ్వర రామ
శేషతల్పసుఖనిద్రిత రామ
బ్రహ్మాద్యమరప్రార్థిత రామ
చండకిరణకుల మండన రామ
శ్రీమద్దశరథనందన రామ
కౌసల్యాసుఖవర్ధన రామ
విశ్వామిత్రప్రియధన రామ
ఘోరతాటకాఘాతక రామ
మారీచాదినిపాతక రామ
కౌశికమఖసంరక్షక రామ
శ్రీమదహల్యోద్ధారక రామ
గౌతమమునిసంపూజిత రామ
సురమునివరగణసంస్తుత రాం
నావికధావితమృదుపద రాం
మిథిలాపురజనమోదక రామ
విదేహమానసరంజక రామ
త్ర్యంబకకార్ముకభంజక రాం
సీతార్పితవరమాలిక రామ
కృతవైవాహికకౌతుక రామ
భార్గవదర్పవినాశక రామ
శ్రీమదయోధ్యాపాలక రాం

### అయోధ్యా కాండః.

అగణితగుణగణభూషిత రాం
అవనీకామినీకామిత రామ
రాకాచంద్రసమానన రామ
పితృవాక్యాశ్రితకానన రామ

ప్రియగుహవినివేదితపదరాం
క్షాళితనిజమృదుపదరామ
భరద్వాజముఖానందకరామ
చిత్రకూటాద్రినికేతనరామ
దశరథసంతతచింతితరామ
కైకేయీతనయార్థితరామ
విరచితనిజపితృకర్మకరామ
భరతార్పితనిజపాదుకరామ
దండకావనజనపావనరామ

### అరణ్యకాండః

దుష్టవిరాధవినాశనరామ
శరభంగసుతీక్ష్ణార్చితరామ
అగస్త్యానుగ్రహవర్ధితరామ
గృధ్రాధిపసంసేవితరామ
పంచవటీతటసుస్థితరామ
శూర్పణఖార్తివిధాయకరామ
ఖరదూషణముఖసూదకరాం
సీతాప్రియహరిణానుగరామ
మారీచార్తికృదాశుగరామ
వినష్టసీతాన్వేషకరామ
గృధ్రాధిపగతిదాయకరామ
శబరీదత్తఫలాశనరామ
కబంధబాహుచ్ఛేదనరామ

### కిష్కిందాకాండః

హనుమత్సేవితనిజపదరామ
నతసుగ్రీవాభీష్టదరామ
గర్వితవాలిసంహారకరామ
వానరదూతప్రేషకరామ
హితకరలక్ష్మణసంయుతరామ

### సుందరకాండః.

కపివరసంతతసంస్మృతరామ
తద్గతివిఘ్నధ్వంసకరామ
సీతాప్రాణాధారకరామ
దుష్టదశాననదూషితరామ
శిష్టహనూమద్భూషితరామ
సీతావేదితకాకావనరామ
కృతచూడామణిదర్శనరామ
కపివరవచనాశ్వాసితరామ

### యుద్ధకాండః.

రావణనిధనప్రస్థితరామ

వానరసైన్యసమావృతరామ భరద్వాజాదినిషేవణరామ
శోషితసరిదీశార్థితరామ భరతప్రాణవిలీరణరామ
విభీషణాభయదాయకరామ సాకేతపురీభూషణరామ
పర్వతసేతునిబంధకరామ సకలస్వీయసమావృతరామ
కుంభకర్ణశిరశ్ఛేదకరామ రత్నలసత్పీఠస్థితరామ
రాక్షససంఘవిమర్దకరామ పట్టాభిషేకాలంకృతరామ
అహిమహిరావణమారణరామ పార్థివకులసమ్మానితరామ
సంహృతదశముఖరావణరామ విభీషణార్పితరంగకరామ
విధిభవముఖసురసంస్తుతరామ కీశకులానుగ్రహకరరామ
ఖస్థితదశరథవీక్షితరామ సకలజీవసంరక్షకరామ
సీతాదర్శనమోదితరామ సమస్తలోకాధారకరామ
అభిషిక్తవిభీషణనతరామ రామరామజయరాజారామ
పుష్పకయానారోహణరామ రామరామజయసీతారామ.

---

## శ్రీగురుధ్యానము.

1. ఓమ్ నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే।
నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణామూర్తయే నమః॥
2. ఓమ్ బ్రహ్మానందమూర్తినతే శ్రితానాంశుద్ధిసేతవే।
నారాయణసంజ్ఞకాయ నమ్ర శ్రీగురవేనమః॥

3. గుర్బ్రహ్మ గురుర్విష్ణు గ్గురుర్దేవో మహేశ్వరః॥
గురు స్సాక్షాత్ పరం బ్రహ్మ తస్మై శ్రీగురువే నమః॥

4. ఓమ్నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తించతత్పుత్ర పరాశరంచ వ్యాసంశుకం గౌడపదంమహాంతం గోవిందయోగీంద్రమథాస్యశిష్యం। శ్రీ శంకరాచార్య మథాస్య పద్మపాదంచ హస్తామలకంచశిష్యం తం త్రోటకంవార్తికకారమన్యాన స్మద్గురూన్ సంతతమానతోస్మి॥

5. శృతిస్మృతి పురాణానా మాలయం కరుణాలయం నమామిభగవత్పాదం శంకరం లోకశంకరం। శంకరంశంకరాచార్యం కేశవం బాదరాయణం సూత్రభాష్య కృతౌ వందే భగవంతౌ పునఃపునః॥

6. నిత్యానందైకందాయ నిర్మలాయ చిదాత్మనే।
జ్ఞానోత్తమాయగురవే సాక్షిణేబ్రహ్మణేనమః॥

7. కృష్ణద్వైపాయనంవ్యాసం సర్వలోకహితేరతం।
వేదాబ్జభాస్కరంవందే శమాదినిలయంమునిం॥

8 నగురోరధికంనగురోరధికం నగురోరధికంనగురోరధికం
శివశాసనతః శివశాసనతః శివశాసనతః శివశాసనతః

గురుమంత్రము॥ ఓమ్ లేక॥ సోహం॥ ఇది అజపగాయత్రీ॥

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్।
యః ప్రయాతిత్యజన్ దేహం సయాతిపరమాంగతిమ్॥

ఓమ్ శ్రీరామతారకబ్రహ్మణేనమః.

## శ్రీరామధ్యానము.

1. ధ్యాయేదాజానుబాహుం ధృతశరధనుషంబద్ధ పద్మాసనస్థం పీతంవాసోవసానం నవకమలదళ స్పర్ధినేత్రంప్రసన్నం। వామాంకారూఢసీతా ముఖకమలమిలల్లోచనం నీరదాభం నానాలంకారదీప్తం దధతమురు జటామండలం రామచంద్రం॥

2. శ్రీరామ రామ రఘునందన రామ రామ
శ్రీరామ రామ భరతాగ్రజ రామ రామ।
శ్రీరామ రామ రణకర్కశ రామ రామ
శ్రీరామ రామ శరణం భవ రామ రామ॥

3. భర్జనం భవబీజానామార్జనం సుఖసంపదాం।
తర్జనం యమదూతానాం రామరామేతిగర్జనం॥

4. లోకాభిరామం రణరంగధీరం రాజీవనేత్రం రఘువంశనాథం। కారుణ్యరూపం కరుణాకరం తం శ్రీరామచంద్రం శరణం ప్రపద్యే॥

5. శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే॥

6. మంగళం భగవాన్విష్ణుర్మంగళం మధుసూదనః।
మంగళం పుండరీకాక్షో మంగళం గరుడధ్వజః॥
7. మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే।
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళం॥
8. మంగళం వేదవేద్యాయ మేఘశ్యామల మూర్తయే।
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళం॥

9. శ్రీరామతారకమంత్రము.

1. ఓమ్ రాం రామాయ నమః।
2. (ఓమ్ శ్రీరామ రామ రామ)

రకారోచ్చారమాత్రేణ ముఖాన్నిర్యాతి పాతకం।
పునరాగమభీత్యాచ మకారస్తు కవాటవత్॥

శ్రీపరమేశ్వరపరమాత్మనేనమః

శ్రీశివధ్యానము

1. వందే శంభుముమాపతిం సురగురుం వందే జగత్కారణం
వందే పన్నగభూషణం మృగధరం వందే పశూనాంపతిం
వందే సూర్యశశాంకవహ్నినయనం వందే ముకుందప్రియం
వందే భక్తజనాశ్రయంచ వరదం వందే శివం శంకరం॥

2. ఓంనమో దేవదేవాయ లోకానాం సిద్ధిహేతవే।
సచ్చిదానందరూపాయ శివాయపరమాత్మనే॥

3. నమస్తవాతు శాంతాయ కారణత్రయహేతవే।
నివేదయామిచాత్మానం త్వంగతిఃపరమేశ్వరా॥

4. సాంబశంభో మహాదేవ కృపాసాగరశంకర।
మచ్చిత్తభ్రమరోనిత్యం తవాస్తుభవపంకజే॥

5. దేవప్రపన్నార్తి హర ప్రసీద ప్రసీదవిశ్వేశ్వర విశ్వ
వంద్య। ప్రసీదగంగాధరచంద్రమౌళే మాంత్రాహి
సంసారభయాదనాథం॥

6. ప్రఫుల్లనీలోత్పలలోచనాయై వికాశపంకేరుహలో
చనాయ। జగజ్జనన్యై జగదేకపిత్రే నమశ్శివాయైచ
నమశ్శివాయ।

7. సత్యంబ్రవీమిపరలోకహితంబ్రవీమి
సారంబ్రవీమ్యుపనిషద్ధృదయంబ్రవీమి
సంసారముల్బణమసారమవాప్యజంతో
స్సారోయమీశ్వరపదాంబురుహస్యసేవా

8. శ్రీమన్మహేశ్వరకృపామయ హేదయాళో
హే వ్యోమకేశశితికంఠగణాధినాథ
హేవిశ్వబంధు కరుణామయదీనబంధో
సంసారదుఃఖగహనాజ్జగదీశరక్ష॥

లక్ష్మీపతిం సురవరార్చిత వేంకటేశం
దారిద్ర్యపూర్వదురితౌఘనిశాచరఘ్నం॥

7. నిత్యాయనిరవద్యాయ సత్యానందచిదాత్మనే।
సర్వాంతరాత్మనే శ్రీమద్వేంకటేశాయ మంగళం॥

8. నమః శ్రీవేంకటేశాయ శుద్ధజ్ఞానస్వరూపిణే।
వాసుదేవాయ శాంతాయ శ్రీనివాసాయ మంగళం॥

శ్రీవేంకటేశమూలమంత్రము.

ఓం నమః శ్రీ వేంకటేశాయ

(ఓం శ్రీ వేంకటేశాయ నమః)

అష్టాక్షరమిదం ధ్యాత్వా భుక్తిముక్తిఫలప్రదం।
రహస్యం సర్వమంత్రాణాం గోపనీయం ప్రయత్నతః॥

హరిః ఓం శ్రీకృష్ణాయ పరమాత్మనే నమః

శ్రీనారాయణధ్యానం

1 మేఘశ్యామం పీతకౌశేయవాసం
శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగం
పుణ్యోపేతం పుండరీకాయతాక్షం
విష్ణుం వందే సర్వలోకైకనాథం॥

2 సశంఖచక్రం సకిరీటకుండలం
సపీతవస్త్రం సరసీరుహేక్షణం।

సహారవక్షస్థలకౌస్తుభశ్రియం।
నమామివిష్ణుంశిరసాచతుర్భుజం॥

3. సచ్చిదానందరూపాయకృష్ణాయాక్లిష్టకారిణే।
నమో వేదాంతవేద్యాయ గురవేబుద్ధిసాక్షిణే॥

4. నారాయణాయపరలోకపరాయణాయ।
కాలాయకాలకమలాయతలోచనాయ।
రామాయరావణవినాశకృతోత్తమాయ।
దీరాయదీరతిలకాయనమోవరాయ॥

5. నమస్తేపుండరీకాక్ష భక్తానామభయంకర
సుబ్రహ్మణ్యనమస్తేస్తు త్రాహిమాంశరణాగతం॥

6. యస్యస్మరణమాత్రేణజన్మసంసారబంధనాత్।
విముచ్యతేనమస్తస్మైవిష్ణవే ప్రభవిష్ణవే॥

7 పద్మపత్రవిశాలాక్షపద్మనాభసురోత్తమ।
భక్తానామనురక్తానాంత్రాతాభవజనార్దన॥

8. నమోస్త్వనంతాయసహస్రమూర్తయే।
సహస్రపాదాక్షిశిరోరుబాహవే।
సహస్రనామ్నేపురుషాయశాశ్వతే।
సహస్రకోటీయుగధారిణేనమః॥

శ్రీ అష్టాక్షరీమహామంత్రం
॥ఓం నమోనారాయణాయ॥
(హా॥ఓం) శ్రీద్వాదశాక్షరి
॥ఓంనమోభగవతేవాసుదేవాయ॥

కిం తస్యదానైః కిం తీర్థైః
కింతపోభిః కిమధ్వరైః
నమోనారాయణేతి
మంత్రః సర్వార్థసాధకః॥

ఓం తత్సత్
శ్రీదత్తాత్రేయధ్యానం.

1 జటాధరం పాండురంగం శూలహస్తం కృపానిధిం।
సర్వరోగహరం దేవం దత్తాత్రేయమహంభజే॥
2. జగదుత్పత్తికర్త్రేచ స్థితిసంహారహేతవే।
భవపాశవిముక్తాయ దత్తాత్రేయనమోస్తుతే॥
3 జరాజన్మవినాశాయ దేహశుద్ధికరాయచ।
దిగంబరదయామూర్తే దత్తాత్రేయనమోస్తుతే॥
4 కర్పూరకాంతిదేహాయ బ్రహ్మమూర్తిధరాయచ।
వేదశాస్త్రపరిజ్ఞాయ దత్తాత్రేయనమోస్తుతే॥

5. ఆదౌబ్రహ్మా మధ్యేవిష్ణురంతే దేవస్సదాశివః।
మూర్తిత్రయస్వరూపాయదత్తాత్రేయనమోస్తుతే॥
6. దిగంబరాయదివ్యాయ దివ్యరూపధరాయచ।
సదోదితపరబ్రహ్మ దత్తాత్రేయనమోస్తుతే॥
7. అవధూతసదానందపరబ్రహ్మస్వరూపిణే।
విదేహదేహరూపాయదత్తాత్రేయనమోస్తుతే॥
8. సత్యరూపసదాచారసత్యధర్మపరాయణ।
సత్యాశ్రయపరోక్షాయదత్తాత్రేయనమోస్తుతే।
ఇదంస్తోత్రంమహాద్దివ్యందత్తప్రత్యక్షకారకం।
దత్తాత్రేయప్రసాదాచ్చనారదేనప్రకీర్తితం॥

## శ్రీగణేశాదిధ్యానచతుష్టయం.

1. ఓమ్ఓమ్ ఓమ్కారరూపం త్ర్యహమితిచపరంయత్స్వరూపంతురీయం।
త్రైగుణ్యాతీతనీలంకలయతి మనసస్తేజసిందూరమూర్తిం।
యోగీంద్రై బ్రహ్మరంధ్రై సకలగుణమయం శ్రీహరేంద్రేణసంగం।
గంగంగంగం గణేశం గజముఖమభితో వ్యాపకం చింతయంతే॥

2 లంబోదరం పరమసుందర మేకదంతం|
రక్తాంబరత్రినయనం పరమంపవిత్రం|
ఉద్యద్దివాకరకరోజ్జ్వలకాంతికాంతం|
విఘ్నేశ్వరంసకలవిఘ్నహరంనమామి||

## శ్రీసుబ్రహ్మణ్యధ్యానం

1. కనకకుండలమండితషణ్ముఖం
వనజరాజివిరాజితలోచనం
నిశితశస్త్రశరాసనధారిణం
శరవణోద్భవమీశసుతంభజే||

2 శ్రీకార్తికేయ కరుణామృత పూర్ణదృష్ట్యా|
కామాదిరోగ కలుషీకృతదుష్టచిత్తం|
సిక్త్వాతుమామవకళాధరకాంతికాంత్యా|
వల్లీసనాథమమదేహికరావలంబం||

## శ్రీసరస్వతీధ్యానం.

1. యాకుందేందు తుషారహార ధవళాయా శుభ్రవస్త్రావృతా
యావీణావరదండ మండితకరా
యా శ్వేతపద్మాసనా|

యాబ్రహ్మాచ్యుతశంకరప్రభృతిభి
ర్దేవైస్సదాపూజితా।
సామాంపాతుసరస్వతీభగవతీ
నిశ్శేషజాడ్యాపహా॥

2. నిత్యానందేనిరాధారే నిష్కళాయైనమోనమః।
విద్యాధారేవిశాలాక్షి శుద్ధజ్ఞానేనమోనమః॥

## శ్రీహనుమద్ధ్యానం.

---

1. మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియంబుద్ధిమతాంవరిష్ఠం।
వాతాత్మజంవానరయూథముఖ్యం
శ్రీరామదూతంశరణంప్రపద్యే॥

2 ఆమ్రీకృతమార్తాండం గోష్పదీకృతసాగరం।
తృణీకృతదశగ్రీవ మాంజనేయంనమామ్యహం॥

3. కూజంతంరామరామేతి మధురంమధురాక్షరం।
ఆరుహ్యకవితాశాఖాం వందేవాల్మీకికోకిలం॥

ఓంతత్సత్ బ్రహ్మణేనమః

అ హిం సా ప ర మో ధ ర్మః

శివకేశవయోరభేదం

1. శివాయవిష్ణురూపాయ శివరూపాయవిష్ణవే।
శివశ్చహృదయంవిష్ణు ర్విష్ణోశ్చహృదయంశివః॥
2. మద్భక్తశ్శంకరద్వేషీ మద్వేషీశంకరప్రియః।
తావుభౌనరకంయాతి యావచ్చంద్రదివాకరం॥
3. నారాయణశ్శివోవిష్ణు శ్శంకరఃపురుషోత్తమః।
ఏతేషునామభిర్బ్రహ్మ పరంప్రోక్తంసనాతనం॥
4. హరంహరింవిధాతారం యఃపశ్యేదేకరూపిణం।
సయాతిపరమానందం సయోగీబ్రహ్మఉచ్యతే॥
5. యత్సర్వంసముత్పన్నం నిర్గుణాత్పరమాత్మనః।
తదేవశివసంజ్ఞంహి వేదవేదాంతినోవిదుః॥
6. యోవిష్ణుస్స్వయంబ్రహ్మ యోబ్రంహ్మాసామహేశ్వరః।
వేదత్రయేచయజ్ఞేష్వస్మిన్ పండితేష్వేషునిశ్చయః॥
7. హరిశంకరయోర్మధ్యే బ్రంహ్మణశ్చాపియోనరః।
భేదకృన్నరకంభుక్తె యావదాచంద్రతారకం॥

8. యోగాంగురుంపాశుపతం
వ్రతంద్వేషినరాధిప।
విఘ్నంవాసనముచ్ఛేృత
జన్మకోటిశతైరపి॥

ఓంతత్సత్ పరమాత్మనేనమః.

## వైరాగ్యాష్టకం.

1. నవైరాగ్యాత్పరోలాభః నబోధాదపరంసుఖం।
నగురోరపరత్రాతా నసంసారాత్పరోరిపుః॥

2. యోగస్యప్రథమంద్వారం వాఙ్నిరోధోపరిగ్రహః।
నిరాశాచనిరీహాచ నిత్యమేకాంతశీలతా॥

3. అత్యంతవైరాగ్యవతః
సమాహితస్యైవదృఢప్రబోధః
ప్రబుద్ధత్వస్సహిబంధముక్తి
ర్ముక్తాత్మనోనిత్యసుఖానుభూతిః

4. అభేదదర్శనంజ్ఞానం ధ్యానంనిర్విషయంమనః।
స్నానంమనోమలత్యాగః శౌచమింద్రియనిగ్రహః॥

5. బ్రహ్మాదిస్తావరాంతేషు వైరాగ్య విషయేష్వసు।
యథైవకాకవిష్ఠాయాం వైరాగ్యంతద్ధినిర్మలం॥

6. గతేప్రాణేయథాదేహే సుఖమఃఖేనవిందతి।
తదాప్రాణయుక్తోపి సకైవల్యాశ్రయోభవేత్।

7. యదాసర్వే ప్రముచ్యంతే కామాయస్యహృదిశ్రితాః।
అథమర్త్యోఽమృతోభవ త్యత్రబ్రహ్మసమశ్నుతే।
8. వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః।
ధ్యానయోగపరోనిత్యం వైరాగ్యంసముపాశ్రితః।

## వైరాగ్యఫలము.

వైరాగ్యంప్రశంసంతి సద్యఃఫలంబ్రహ్మదర్శనం।
తస్మాదభ్యేతవిరతిం బుధోయత్నేనసర్వదా।
ఓంతత్సత్ బ్రహ్మణేనమః.

## విరక్తి.

1. అమేధ్యపూర్ణంక్రిమిజాలసంకులం
స్వభావదుర్గంధమశౌచమధ్రువం
కళేబరంమూత్రపురీషభాజనం
రమంతిమూఢానరమంతిపండితాః॥
2. జాతంమృతమిదందేహం
మాతాపితృమలాత్మకం
సుఖదుఃఖాలయామేధ్యం
స్పృష్ట్వాస్నానంవిధీయతే।
3. నవద్వారమలస్రావం
సదాకాలేస్వభావజం

దుర్గంధందు ర్మలోపేతం
స్పృత్వాస్నానంవిధీయతే॥

4. అహిమివజనయోగంసర్వదావర్జయేద్యః
కుణపమివసునారీంత్యక్తుకామోవిరాగీ।
విషమివవిషయాన్యో మన్యమానోదురంతాఞ్
జయతిపరమహంసో ముక్తిధామంసమేతి॥

5. విషంవిషయవైషమ్యం
నవిషంవిషముచ్యతే।
జన్మాంతరఘ్నావిషయా
ఏకదేహాహరంవిషం॥

6. భగేనచర్మకుండేన దుర్గంధేనవ్రణేనచ।
ఖండితంహిజగత్సర్వం సదేవాసురమానవం॥

7. అజిహ్వష్షండకోపంగు రంధోబధిరఏవచ।
ముగ్ధశ్చముచ్యతేభిక్షు షడ్భిరేతైర్నసజ్జతే॥

8. బాహ్యస్పర్శేష్వసక్తాత్మా
విందత్యాత్మనియత్సుఖం।
సబ్రహ్మయోగయుక్తాత్మా
సుఖమక్షయ్యమశ్నుతే।

# ధ్యానామృతమ్.

ఓం తత్సత్ పరబ్రహ్మణేనమః.

## స్వరూపస్థితి (ధ్యానం).

1. హృదయకమల మధ్యే దీపవత్ వేదసారం
ప్రణవమయమతర్క్యం యోగిభిర్ధ్యానగమ్యం।
హరిగురుశివయోగ్యం సర్వభూతస్థమేకం
సకృదపి మనసా వై ధ్యాయతే యస్స ముక్తః॥
2. సోహం చిన్మాత్రమేవేతి చింతనం ధ్యానముచ్యతే।
ధ్యానస్యాపి స్మృతిస్సమ్యక్ సమాధిరభిధీయతే॥
3. యేన శబ్దం రసం రూపం గంధం జానాసి రాఘవ।
తమాత్మానం పరంబ్రహ్మ జానీహి పరమేశ్వరం॥
4. బ్రహ్మైవాస్మీతి సద్వృత్త్యా నిరాలంబతయా స్థితిః।
ధ్యానశబ్దేన విఖ్యాతా పరమానందదాయినీ॥
5. అహమేవ పరంబ్రహ్మ వాసుదేవాఖ్యమవ్యయం।
ఇతి స్యాన్నిశ్చితో ముక్తో బంధ ఏవాన్యథా భవేత్॥
6. నిత్యశుద్ధవిముక్తైకమఖండానందమద్వయం।
సత్యం జ్ఞానమనంతం యత్పరం బ్రహ్మాహమేవ తత్॥
7. న మృత్యుర్న శంకా న మే జాతిభేదః
పితా నైవ మే నైవ మాతా చ జన్మ।
న బంధుర్న మిత్రం గురుర్నైవ శిష్య
శ్చిదానందరూపః శివోహం శివోహం॥

8. నాహం దేహో నచ ప్రాణో నేంద్రియాణి మనో నహి
సదా సాక్షిత్వరూపత్వా చ్ఛివఏవాస్మి కేవలః
ధ్యానస్నాద్దేజ్ఞానజలే రాగద్వేషమలాపహే
యఃస్నాతిమానసేతీర్థేసయాతిపరమాంగతిం॥

ఓంతత్సత్ పరబ్రహ్మణే నమః

వేదాంతసారం.

1. శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంధకోటిభిః।
బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాపరః॥
2. జీవశ్శివశ్శివో జీవః సజీవః కేవలశ్శివః।
ఆశాపాశస్థితో జీవః పాశముక్తస్సదాశివః॥
3. ననిరోధో నచోత్పత్తి ర్నబంధో నచసాధకః।
నముముక్షుర్నవైముక్త ఇత్యేషాపరమార్థతా॥
4. సర్వభూతస్థమాత్మానం సర్వభూతానిచాత్మని।
ఈక్ష్యతేయోగయుక్తాత్మా సర్వత్రసమదర్శనః॥
5. యస్మిన్సర్వాణిభూతాన్యాత్మైవాభూద్విజానతః।
తత్రకోమోహఃకశ్శోక ఏకత్వమనుపశ్యతః॥
6. మనసైవేదమాప్తవ్యం నేహనానాస్తికించన।
మృత్యోస్సమృత్యుంగచ్ఛతియ ఇహనానేవపశ్యతి॥
7. సఘ్ఘనంచిద్ఘనంనిత్య మానందఘనమక్రియం।
ఏకమేవాద్వయంబ్రహ్మ నేహనానాస్తికించన॥

8 సర్వంబ్రహ్మేతియస్యాంత ర్భావనాసావిముక్తిదా।
భేదబుద్ధిరవిద్యేయం సర్వథాతాంపరిత్యజేత్॥

వేదాంతరహస్యం అనాత్మభూతేదేహాదా
నాత్మబుద్ధిస్తుదేహినాం
సావిద్యాతత్కృతోబంధ
స్తన్నాశోమోక్షఉచ్యతే॥

## మహావాక్య చతుష్టయం.

---

1. ప్రజ్ఞానంబ్రహ్మ
2. అహంబ్రహ్మాస్మి
3. తత్వమసి
4. అయమాత్మాబ్రహ్మ

బ్రహ్మైవేదమితిప్రాహ శ్రుతిరప్యతినిర్మలా।
విమహామనుభూతిశ్చ తద్దైవహినసంశయః॥

అహంబ్రహ్మాస్మిమంత్రోయం
జన్మపాపంవినాశేత్।
అహంబ్రహ్మాస్మిమంత్రోయం
జ్ఞానానందంప్రయచ్ఛతి॥

ఓం శ్రీకృష్ణాయపరమాత్మనేనమః

## బ్రహ్మవిద్యాధికారిలక్షణము

1. యోగాధికారిణఃసర్వే ప్రాణినఃసర్వదాయత॥
బాలోవృద్ధోవ్యాధియుక్తోయువాస్త్రీశూద్రజన్మభృత్॥

సనత్కుమారసంహిత.

2. బ్రహ్మచారిగ్రహీవాపి వానప్రస్థోథవాయతిః।
నారీవావృషలోవాపి పక్వోబ్రహ్మవిచారయేత్॥

శ్రీరమణగీత.

3. బ్రహ్మక్షత్రవిశశ్శూద్రా స్త్రియశ్చాత్రాధికారిణః।
బ్రహ్మచారీగృహస్థోవా నుపనీతోథవాద్విజః॥

శ్రీ శివగీత.

4. మాంహిపార్థవ్యపాశ్రిత్య యేపిస్యుఃపాపయోనయః
స్త్రియోవైశ్యాస్తథాశూద్ర స్తేపియాంతిపరాంగతిం॥

శ్రీ భగవద్గీత.

5. బ్రాహ్మణక్షత్రియవిశాం
స్త్రీశూద్రాణాంచపావనం।
శాంతయేకర్మణామన్య
ద్యోగాన్నాస్తివిముక్తయే॥

యోగసారం.

6. నచ కర్మణోనర క్తస్య నమాంసస్య బాస్తినః।
వజాతిరాత్మనోజాతి ర్వ్యవహారప్రకీర్తితా॥
తేజోబిందోపనిషత్.

7. బ్రాహ్మణ్యంకులగోత్రేచ
నామసౌందర్యజాతయః।
స్థూలదేహగతాఏతే
హ్యలింగస్యనవిద్యతే॥
దత్తాత్రేయగీత.

8. మైత్రేయీసులభాగార్గీ
శాండిల్లీచతపస్వినీ।
ఏతేచాన్యేచబహవో
నీచయోనిగతాఅపి॥
జ్ఞాననిష్ఠాంపరాంప్రాప్తా
బ్రహ్మధ్యానస్యవైభవాత్.
సాధనచతుష్టయసంపత్తి.

సాధన చతుష్టయసంపత్తి గలవారెవరయినను వారేవేదాంతమున కధికారి.

.. యస్యసాధనసంపన్న శశ్వతస్యప్రసాదతః।
యజ్ఞాదికర్మకరణా స్యాధికారీనిరూప్యతే॥

2. స్వవర్ణాశ్రమధర్మేణ తపసాహరితోషనాత్।
సాధనం ప్రభవేత్పుంసాం వైరాగ్యాదిచతుష్టయం॥

తా॥ యెవరు యేస్థితిని పొందగోరుతున్నారో దానికి సరియయిన యనుష్ఠానముచేతను జపధ్యానవ్రతములైన తపస్సుచేతను జగధీశ్వర కరుణగలుగుటకొంకు జీవకారుణ్యాదైవభక్తిచేతను జీవులకు వైరాగ్యాది సాదనచతుష్టయసంపత్తి గలుగుచున్నది.

సాదనచతుష్టయసంపత్తియేమనగా:—

1. నిత్యానిత్యవస్తువివేకము.
2 యిహాముత్రఫలభోగవిరాగము.
3. శమాదిషట్కసంపత్తి.
4 ముముక్షుత్వము.

ఈ నాలుగున్నూ మోక్షాపేక్షకలవారికి సంపూర్ణముగా నుండవలయును నిత్యానిత్య వస్తువివేకమనగా బ్రహ్మమొక్కటియె సత్యమనియు జగత్తు మరుమరీచకజలమువలె అసత్యమని తెలుసుకొనుట ఇహాముత్రఫలభోగవిరాగమనగా ఇహమందు సుఖసాధనముల నిశ్చయించినదే సాధనధాన్య పుత్రమిత్ర కళత్ర వస్త్రాభరణ సుగంధద్రవ్యపుష్పమాల ఆహారాదివస్తువులందు కుక్కమలమువలె ఆశలేకుండుటయును స్వర్గాది లోకమందు-

దివ్యభోగములున్నూ రంభాద్యప్సరస విషయములలోను విషమువలె విసర్జించుట శమాదిషట్కసంపత్తియనగా 1. శమము 2 దమము 3. వుపరతి 4. తితీక్ష 5. క్షమ 6. శ్రద్ధ యీ ఆరున్నూ శమాదిషట్కసంపత్తియనంబడును శమమనగా అంతరేంద్రియ నిగ్రహము అనగా అంతఃకరణ చతుష్టయములు విషయవాసనచే విషయమార్గమై మనస్సునుపోనియ్యక ఆత్మానుసంధానమందు నిలుపుట దమమనగా బహిరింద్రియనిగ్రహము అనగా చక్షుశ్రవణాది యింద్రియములు శబ్ద స్పర్శ రూపరసాదియందు శద్ధవాసనచే పోవునప్పుడు దానియందు తుచ్ఛబుద్ధికలిగి ధ్యానమందు ప్రజ్ఞాబలముచే వశీకరించినిలుపుట. వుపరతియనగా సర్వసంగ పరిత్యాగముచే విషయవిరక్తికలిగిన చిత్తము ధ్యానానుదమందు రమించుట. తితీక్షయనగా భక్తులు అత్తరు పన్నీరు మొదలయిన సుగంధద్రవ్యములతో అభిషేకము చేశి మల్లెమొల్ల మందారపుష్పములతో అర్చించినప్పుడున్ను దుష్టులు పాదమందు వేశినచెప్పు తీశికొట్టునప్పుడున్నూ వుభయములలో వకేప్రకారముగా సంతోష ద్వేష్యములు పొందకుండుట లేక, ఒక్కరోజు పంచామృత క్షీరాన్నాది లభించినప్పుడును మరియొకదినము కూ

టినీళ్లు అంబిలిదొంకినప్పాటున్ను సంతోషముతో భుజిం
చుట లేక లాభాలాభ సుఖదుఃఖ శీతోష్ణాదియందు స్న
మభావనిష్ఠయైయుండుట. తృప్తియనగా నాకు యీజన్మ
ములోనే మోక్షముదొరకునో లేక, బదరికాశ్రమాది
పుణ్యస్థలములందు తపస్సు చేయవలసివున్నదో లేక,
గురూపదేశప్రకారము నేను నిత్యశుద్ధ బోధస్వరూపుడ
వునో అనుమొదలయిన సంశయముపొందక నిశ్చలప్ర
దయుడై ఓర్పుగలిగియుండుట లేక, దీనికి సమాధాన
మను నామాంతరముగలదు శ్రద్ధయనగా బ్రహ్మనిష్ఠ
యందుగలుగు ప్రతిబంధములు యెన్నివచ్చినను దానిని
లక్ష్యపెట్టక పుత్రధనధాన్య దారాదియందు మమతను
పరిత్యజించి బ్రహ్మనిష్ఠపూర్తికొరకు శక్తిప్రయత్నము చే
యుట. లేక, వేదగురు యీశ్వరునియందు నమ్మకముతో
సర్వావస్థ సర్వకాలములందు వర్తించుట అనగా ఆస్తిక
బుద్ధితో ప్రేమగలిగియుండుట ముముక్షుత్వమనగా అగ్ని
చేదగ్ధమైనవాడు గృహధనదార పుత్ర మిత్రాదులను
చూడక శీతలజలమునందుపరిగెత్తిపోయి ప్రవేశించిన
ట్లు తాపత్రయాగ్నిచే తపించువాడు శీతలముగు శాశ్వ
తానందమోక్షము యెప్పటదొరకునో దానికి యేమిచే
యవలయునో దీన్ని వుపదేశించు సద్గురువు యెప్పుడ

లడో అని పరిభ్రమించుట లేక అల్పజలమందునున్న మత్స్యములు యెండచే నీళ్లుతగ్గి లేకుండున్న సమయమందు జలప్రవాహము లభించుకొరకు యెట్లుపరితపించునో ఆలాగుననే ఆయుస్సు ప్రతిదినము క్షీణించి క్షీణించుపోవుచున్నదే నాకింకను జ్ఞానానందము కలగలేదే అని పరితపించుట యిదే నిజమయిన వైరాగ్యము దీనికే మోక్షేచ్ఛయని మరొక్కపేరు గలదు యీనాలుగు గుణములు యెవరికిగలదో వారెవరయినను బ్రహ్మవిచారమునకు అధికారులై యీగుణములనుపట్టి బ్రహ్మవిచారాధికారము యేర్పడినదిగాని జాతిధర్మాశ్రమ స్త్రీపురుషులనుబట్టి సంబంధించినది కానేకాదు.

ఓం శ్రీపరమేశ్వరాయనమః

## అష్టాంగయోగము.

అష్టాంగయోగమనగా యమ నియమ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధి యని యెనిమిదివిధములు దీనియందు యమ నియమ యీ రెండు ప్రధానములు.

యమమనగా: —

శ్లో॥ అహింసాసత్యమస్తేయం
బ్రహ్మచర్యందయార్జవం।
క్షమాధృతిర్మితాహారం
శౌచంచేతియమాదశ॥

తా॥ అహింస సత్యం అస్తేయం బ్రహ్మచర్యం దయా అర్జవం క్షమా ధృతి మితాహారం శౌచం అని పదివిధములు దీనియందు అహింస మొట్టమొదట చెప్ప కారణమేమనగా అది యోగమునకు ముఖ్యసాధనమై వున్నది. అది దీపమునకు తైలమువంటిది ఫలమునకు పుష్పమువంటిది తైలములేక దీపముయుండునో పుష్పములేక ఫలముగలుగునా ఆలాగనే అహింస లేనియెడల యోగసిద్ధి రానేరాదు.

అహింసయనగా మనోవాక్కాయములచే వక్క ప్రాణికిన్ని కీడుచేయకుండుట అనగా మాటలచే చెప్పిగాని కరముచేచేసిగాని హృదయమందు దోషతలంపుగాని వుండకుండుట అనగా తనవలె సమస్తప్రాణులను చూచుట లేకసర్వాంతర్యామియైన పరమాత్మ నొక్కటియని తెలిసికొనుట.

నియమమనగా:—

శ్లో॥ తపస్సంతోషమాస్తిక్యం
ధ్యానమీశ్వరపూజనం।
వేదాంతశ్రవణాచైవ
హ్రీర్మతిశ్చజపోవ్రతం॥

తా॥ తపము సంతోషము ఆస్తిక్యము దానము ఈశ్వరపూజనము వేదాంతశ్రవణము లజ్జ మతి వ్రతము అనుసీవది యున్న నియమమునంజదును, దీనియందు తపము ప్రథమముగా చెప్పకారణమేమనగా అద్వైతజ్ఞాన సిద్ధికొరకు ప్రధానసాధనమైయున్నది తపమనగా అల్పాహారస్వల్పనిద్రచే. చిత్తైకాగ్రముచేసి బ్రహ్మధ్యానము చేయుట

3 ఆసనములు అనేకవిధములు దానియందు సిద్ధం పద్మం రెండు శ్రేష్ఠములు లేక యేపరబ్రహ్మమందు బ్రహ్మానందముచే నిశ్చలహృదయముకలదో అదే నిజమైన బ్రహ్మాసనమనంబడును.

4. ప్రాణాయామము యిది రేచక పూరక కుంభక కేవలకుంభకమని నాలుగువిధములు లేక దానియందు

వృత్తమప్రాణాయామము ప్రపంచమైన సమస్తవిషయ ములున్ను హృదయమునుండి బయిటకోలట యిదే రేచకము. అభేదాది స్వభావముతో సైత్రాదిగుణములను హృదయమందు నిండజేయుట యిదేపూరకము మనోవృత్తులను నాశముజేసి బ్రహ్మానందభరితుడై యిది యంతయు బ్రంహ్మమని దృఢప్రజ్ఞుడైయుండుట యిదే కుంభకము.

5. ప్రత్యాహారము ప్రపంచమునందుగల విషయములందు పూర్వజన్మకర్మ వాసననసరించి మనస్సును పోనియ్యక బ్రంహ్మధ్యానమందు నిలుపుట లేక మనస్సు యెచ్చటెచ్చటపోయినను అచ్చటచ్చట అంతయున్నా పరబ్రంహ్మమని చింతించుట యీరెండున్ను మోక్షమునకు బహిరంగసాధనములు.

6. ధారణయనగా ఇంద్రియ సంయమముచే హృదయగుహయందు చలనములేక పరమాత్మస్వరూప స్థితియందు నిలుపట లేక హృదయకమల మధ్యమందు జ్యోతిర్మయమయముతో ప్రణవ ధ్యానముతోగూడ నిలుపట.

7. ధ్యానము తాను ధ్యానించిన స్వరూపముకంటె నితరచింతనము మనమందురానియ్యక ఆ స్వరూపస్థితి యందు బుద్ధితోగూడ నైక్యముచేయుట.

8. సమాధియనగా ధ్యానధ్యేయ భేదములేకనొ కైక్యమై ధ్యాత ధ్యానం ధ్యేయములైన త్రిపుటులన శించి వ్యవహారములు శీతోష్ణాది గుణములున్న క్షుత్పిపాసాది బాధలున్న తెలియక బ్రహ్మానందమయ మైయుండుట యీయవస్థయె విదేహకైవల్యము లేక బ్రహ్మవిద్వరిష్ఠావస్థ యిదేసహజమైన జీవన్ముక్తి.

శ్లో॥ సమాధించపరంయోగం
బహుభాగ్యేనలభ్యతే,
గురోఃకృపాప్రసాదేన
ప్రాప్యతేగురుభక్తితః॥

ఓ ప్రియమైనవాయనులారా యీ మహావస్తను పొందుకొరకు కరుణానిధియైన శ్రీజగధీశ్వర కారుణ్యా కటాక్షామృతము నిండి యుండవలయును. అలాగువనే సద్గురువుయొక్క సంపూర్ణమైన కరుణకు పాత్రులు కావలయును సమస్త జీవరాసియందును చెప్పవలవిలేని భూతదయ సంపాదించవలయును దీన్ని అన్నిటికిన్ని

యింద్రియ సంయమము పట్టుపడునట్లకై పాటుపడవల యును. ఈ గుణములు సంపూర్ణముగా లేనివారికి బ్రంహ్మపద మంటదు బ్రహ్మానందసుఖము బొందడు. ఎట్లనగా వలలేక మత్స్యములున్నా అస్త్రశస్త్రములు లేక ఘోరమృగములున్నా ఔషధములు లేక రోగ మున్నా దీపములేక చీకటిన్నా అన్నములేక ఆకలియున్నా పేరుమాత్రములచే యెట్టుసిద్ధికానేరదో అలాగుననే నేనురాజయోగి రాజయోగి గురుపుత్రుడు గురుపుత్రుడు లేక బ్రహ్మాస్మి బ్రహ్మాస్మి అని కోటిసార్లు చెప్పినప్పటికిన్ని ఆపదములు నిష్ప్రయోజనములు యెట్లనగా మనుమ రీచక జల అతిశీతళము వంధ్యాపుత్ర దతిసుందరుడు గగనకుసుమ అతిమనోహరమయిన సుగంధము. అను యీపదములకు యెంతయర్థగాంభీర్యముకలదో అట్లు సాధనగుణములు లేనివారికి జ్ఞానము ప్రయోజనము కానేరదు.

ఓం తత్సత్ బ్రంహ్మార్పణమస్తు.

ఓం శాంతి శాంతి శాంతిః

## ఉపదేశ త్రయములు.

1. ప్రతిదినమున్ను హృదయగృహాయందు యేకా గ్రచిత్తుడై బ్రంహ్మధ్యానము చేయుచునేయుచు రాగా

రాగా ఒక్కదినమునను ఆత్మానుభవస్వరూపసిద్ధి కలుగును. అనగా పరమాత్మ ప్రత్యక్షమగును. దధిమథనము చేయుచుచేయుచురాగారాగా వెన్న బయలుదేరనట్లున్ను అరణిమథనము పునఃపునః చేసినప్పుడు అగ్నిప్రజ్వలించునట్లున్ను కూపము త్రవ్వగత్రవ్వగ జలముప్రవహించునట్లున్ను యీ బ్రహ్మనిష్ఠులున్ను పరిపూర్ణానంద తృప్తులగుదురు ఎవరికి స్వానుభవసిద్ధిరాలేదో వారికి మననవిధి ధ్యాసనధ్యానములు యింకనుచాలదు. ఏ కారణముచే పెరుగునుండి నవనీతము వేరుపడలేదో మర్ధనముచాలదు అరణినుండి యేకారణముచే అగ్ని జనించలేదో మథనము తక్కువగానుండును: ఎందుచేత భావియందు జలము గనబడలేదో మట్టి పొడవటం చాలదు. ఇదియే దీనికి కారణములు.

2 అతివ్యభిచారస్వభావముగల స్త్రీయున్ను అలాగువనే పురుషుడున్ను తనజాతి ధర్మశాస్త్రములను వుల్లంఘించి మాతా పితా సహోదరునుంగూడ పరిత్యజించి అల్పసుఖ బహుక్లేశమయిన విషయసుఖముకోరకు పరపురుష పరస్త్రీలను అనుగమింపుచున్నదిగదా అలాగువనే అవ్యభిచారిణియయిన భక్తిగల స్త్రీయున్ను

ఆత్మారాముడయిన పరమపురుష ఆత్మారామ క్రీడాసుఖ బ్రంహ్మానందమునకున్ను అట్లనే విరక్తియయిన ముక్తి కాంతా విహారానంద శాశ్వితసుఖ మోక్షమునకు పురుషుడున్నూ సర్వసంగ పరిత్యాగులయి స్వజన త్యాజ్య శీలులయి మానాభిమాన రహితులయి సంచరించిన విషయము. ఆశ్చ్యర్యమా కాదు కాదు దీనియందు ఒక్కటి అతి అజ్ఞానముయొక్క స్వభావము. రెండవది ఉతీతజ్ఞానము గలుగునప్పుడు వున్న అవస్తగాయన్నది.

3. ఒక్క మలినమయిన వస్త్రము సబ్బువేశి నిర్మలజలమందు కఠినమయిన రాతిపైన వుతుకునప్పుడు యేలాగున తన మురికితనముపోయి పూర్వస్థితివలె శుభ్ర వస్త్రమవుతున్నదో ఆలాగుననే పరిశుద్ధస్వరూపియయిన ఆత్మను మధ్యకాలమందు భాదించిన అజ్ఞానమయిన మలము నివారణకొరకు గురూపదేశమయిన సబ్బువేశి దైవభక్తియైన నిర్మలజలమందు వైరాగ్యమైన కఠినరాతిపై జ్ఞానధ్యానములయిన వుతుకువుతుకు నప్పుడు తనస్వరూపస్థితిని పొందును. అనగా మాయా విముక్తి కలుగును.

### కలికల్మష నాశనమంత్రము.

హరేరామ హరేరామ
రామరామ హరేహరే।
హరేకృష్ణ హరేకృష్ణ
కృష్ణకృష్ణ హరేహరే॥

శ్లో॥ ఇతిషోడశకంనామ్నాం
కలికల్మషనాశనం।
నాతఃపరతరోపాయః
సర్వవేదేషుదృశ్యతే॥

ఈ మంత్రము కలిసంతారణోపనిషత్తుల యందు కలదు.

ఇది శ్రీ నారద మహాఋషులవారు కలియుగ ప్రాబల్యముచే జనులు అజ్ఞానాంధకార సంసారసాగరమందు మునిగి తేలుటచూచి బ్రహ్మలోకము ప్రవేశించి యీజనుల వుద్ధారణకొరకు బ్రహ్మదేవునితో అడిగినప్పుడు సృష్టికర్తయైన విధాతవుపదేశించిన మంత్రము ఈనీరహస్యము అంధుడు సూర్యుని యెరుగజాలడో అలాగుననే మధాంధకారులు తెలియజాలరు.

ఓమ్ తత్సత్.

ధ్యానామృతము-సంపూర్ణము.

# →| పీఠిక. |←

| పేజి. | పఙ్క్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 4 | సర్గ | వర్గ |
| | | శాశ్వీత | శాశ్వత |
| | 5 | వశిష్ట | వసిష్ఠ |
| | 6 | మహాఋషుల | మహర్షుల |
| 2 | 5 | కర్మ వుపాసన | కర్మ ఉపాసన |
| | 8 | శూద్ర్వులు | శూద్రులు |
| | 9 | బ్రంహ్మ | బ్రహ్మ |
| | 18 | చున్నయది | చున్నది |
| 3 | 1 | మహాఋషి | మహర్షి |
| | 4 | మహాఋషి | మహర్షి |
| | | సంబోద | సంభూత |
| | 5 | సప్తఋషులు | సప్తర్షులు |
| | 10 | మ్లేచ్చ | మ్లేచ్ఛ |
| | 18 | వెంగమాంబా | వెంగమాంబ |
| 4 | 12 | వనక్ | నావక్ |
| 5 | 2 | పూర్న | పూర్ణ |
| | 8 | స్తల | స్థల |
| | 11 | అధి | అది |
| 6 | 4 | కటికాదిగు | కటకా |

| | | | |
|---|---|---|---|
| | 12 | శృతులు | శ్రుతులు |
| 7 | 1 | దాన్యాది | ధ్యానాది |
| | 4 | అతిధి | అతిథి |
| | 5 | వాడు | వారు |
| | 9 | అనుష్టించ | అనుష్ఠించ |
| | | బహిశ్శుద్ధి | బహిర్శుద్ధి |
| | | ప్రదానము | ప్రధానము |
| | 12 | ద్యాన | ధ్యాన |
| | | వ్యర్ధమే | వ్యర్థమే |
| 8 | 6 | కలో | కలా |
| | 7 | భోద | బోధ |
| | 8 | బ్రాహ్మ | బ్రహ్మ |
| | 11 | ద్యానా | ధ్యానా |
| | 12 | సాధనః | సాధనం |
| | 17 | వుప | ఉప |
| 9 | 3 | బ్రమర | భ్రమర |
| | 12 | వసి | వశి |
| | 13 | త్రఅత్త | తమాత్త |
| | | పశ్యం | పస్యం |
| | 14 | భూతస్త్రం | భూతస్థం |
| | 15 | యాది | యాతి |

| | | | |
|---|---|---|---|
| 10 | 12 | చండాది | చండాలాది |
| 11 | 12 | వుపాసతే | ఉపాసతే |
| 14 | 12 | మధాంధ | మదాంధ |
| 15 | 2 | జగథీశ్వరుండు | జగదీశ్వరుడు |




| | | | |
|---|---|---|---|
| 4 | 8 | స్మృతి | స్మృతి |
| 5 | 8 | దృత | ధృత |
| | | బద్ద | బద్ధ |
| | 4 | స్ఫూర్థి | స్ఫూర్తి |
| 6 | 2 | ద్వజః | ధ్వజః |
| | 4 | తనో | తనూ |
| | 9 | త్రారణం | కారణం |
| 7 | 2 | సచ్చి | సచ్ఛి |
| | 4 | పరమేశ్వరా | పరమేశ్వర |
| | 9 | భయాధనాథం | భయాదనాథం |
| 8 | 9 | వూర్ణ | పూర్ణ |
| | | ధీక్షితా | దీక్షిత |
| | 12 | మగ్నమా | మగ్నంమాం |
| 9 | 1 | వరార్చిత | వరార్చిత |
| | 3 | వధ్యాయ | వద్యాయా |

| | | | |
|---|---|---|---|
| 10 | 7 | కృతోత్త | కృతోద్య |
| | 12 | ముచ్చ | ముచ్య |
| | 14 | జనార్ధన | జనార్దన |
| 11 | 11 | స్తితి | స్థితి |
| 12 | 4 | నదా | సదా |
| | 10 | దాచ్ఛ | దాచ్చ |
| | 14 | బ్రహ్మాం | ర్బ్రహ్మాం |
| | 15 | మఖ | మభి |
| | 16 | యాంది | యంతి |
| 13 | 2 | పవితం | పవిత్రం |
| | 3 | ఉన్వ | ఉద్వి |
| | 7 | దారిణం | ధారిణం |
| | 9 | పూర్న | పూర్ణ |
| | 12 | సనాధ | సనాథ |
| 14 | 1 | ప్రభృ | ప్రభ్వ |
| | 5 | నిరాదార | నిరాధార |
| | 6 | విధ్యా | విద్యా |
| | 8 | వరిష్టం | వరిష్ఠం |
| | 9 | వాతాత్మసిం | వాతాత్మజం |
| 15 | 2 | శివశ్చ | శివస్య |
| | 4 | తావుఘా | తావుభా |

| | | | |
|---|---|---|---|
| | 14 | యూవధా | యవదా |
| 16 | 8 | ముచ్చ్యేత | ముచ్యేత |
| | 7 | ప్రథవుం | ప్రథమం |
| | 12 | త్వస్స | తత్వస్య |
| | 13 | త్యాగః | త్యాగ |
| | | నిగ్రహ | నిగ్రః |
| | 14 | స్తావ | స్థావ |
| | | వైరాగ్య | వైరాగ్యం |
| | 16 | యథా | యథా |
| | 18 | తదా | తథా |
| 17 | 2 | అధ | అధ |
| 18 | 6 | ముక్తినా | ముక్తిధా |
| 19 | 5 | ముచ్చతే | ముచ్యతె |
| | 13 | ముక్త్వైకా | ముక్త్వైక |
| | 20 | శివ్రూహం | శ్శివ్రూహం |
| 20 | 3 | ద్యాన | ధ్యాన |
| | 5 | గ్రంధ | గ్రంథ |
| | 6 | మిధ్యా | మిధ్యా |
| | 7 | నజీవ | సజీవ |
| | 10 | మార్థతా | మార్గతా |
| 21 | 10 | వినాశేత్ | వినాశయేత్ |

| | | | |
|---|---|---|---|
| 22 | 2 | యువాస్రి | యువాస్త్రీ |
| | 3 | బ్రహ్మచారిగ్ర | బ్రహ్మచారిగృహి |
| | 8 | స్తథాశూద | స్తథాశూద్ర |
| | 10 | స్రశూద్రాణం | స్త్రీశూద్రాణాం |
| 23 | 1 | స్వభా | స్వధా |
| | 9 | ఏతేచాస్వ | ఏతేచాస్య |
| | 12 | ;ధ్యానస్వ | ధ్యానస్య |
| 24 | 1 | తోషనాత్ | తోషణాత్ |
| | 10 | యిహాముత్ర | ఇహాముత్ర |
| 25 | 11 | దానియందు | దానియందు |
| 26 | 16 | శీతఁజమైవ | శీతలమైనజల |
| 28 | 3 | మతాహారం | మితాహారః |
| 29 | 2 | ధ్యానం | దాన |
| | 4 | హ్రీర్మతిచ్ప | హ్రీర్మతిశ్చ |
| 32 | | శాంతిశాంతి | శాంతిః శాంతిః |
| | | గృహ | గుహ |
| 33 | 8 | దారికి | వారికి |
| | | యింనుం | యింకయుం |
| | 12 | పోరవడం | పోవడం |
| 35 | 8 | తయూపాయ | తరోపాయః |
| | 9 | వుపనిషత్తు —— | నిషత్తు |

